నిమ్నజాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశమును గాల్చివేయుననుచు
రాట్నమును దుడ్డుగఱ్ఱ కరానబూని
దెసలదో తెంచె, గుజరాతు ముసలిసెట్టి. ౩

సీమగుడ్డకు కన్నులు చెమ్మగిల్లె
ముతకబట్టకు మర్యాదపాటమరించె
నగరివెలుపలి మాలమాదిగలుగూడ
నరులుసుమ్మని దేశంబు గుఱుతుబట్టె. ౪

వెఱపువలదు నీకు హరిజన సోదరా
స్వీయరాజ్యరథము వెడలివచ్చె
లాగిపొమ్మ నీకు భాగంబు గలదంచు
బాడుచుండె రత్నభరతమాత. ౫

ఒకనాడా మునిపక్షి, తొంటి చెలికాడున్నట్టి గేహంబు లో
నికి నేతెంచి యథావిధిం దిరుగుచుండెఁ మిత్రుఁడీక్షించి, యు
త్సుకతంబొంగిఁ దరస్మితంబున నిదే జోహా రహోపక్షిణీ!
యకలంకంబగునీ సహాయమున నాయర్థంబు పండాయెనే?

నా వర్ణించిన పుణ్యభూములను సందర్శించినావే? మహా
దేవుం డాయనదేవియుం దగిన యాతిథ్యంబు నీ కిచ్చిరే ?
నా వాక్కుల్ జెవినాటితే? మహితరత్న స్వర్ణకాంతి చ్ఛటా
దావద్దివ్యహిమాద్రికందర పవిత్రక్షేత్రముల్ సూచితే?

పుడమి కలుషరాశి మ్రుగ్గిపోవుచు నుండ
నాట్యమాడుకొనుట న్యాయమగునె
భర్గదేవ! సృష్టి పరికించి పొమ్మంచు
బిలిచివచ్చినావె ? పులుగుచెలియ.

కాళిదాసుని మేఘంబు గౌరవంబు
తెచ్చుకొన్నదె నీదు సందేశగాథ
ఘనులుచేకొను భూభృదగ్రముల పూజ
యసమ చతురత్వమున్న బానిసకురాదు.

వ్యాస వాల్మీకిముని మదేభములు రెండు
దిరుగుచుండెనె? కైలాస గిరులమీద
వారి వార్ధక్యమున నీకు స్పష్టమగును
భరత రామాయణంబుల పడుచుఁదనము.

ఆ వాల్మీకి నిసర్గజంతు కరుణావ్యాసక్తి యే సత్కవిన్
గావించెన్ వెడలించె రాముని కథా గాంగేయముం గానిచో
త్రోవల్ గొట్టెడు బోయ కేగురువు నేర్పెం దివ్యగీర్వాణమున్
ఆవేశించి కళాధిదేవి వరమీయన్ విద్యలేమాత్రముల్.

ఎదురై వచ్చెనె కాళిదాసుని లసచ్ఛృంగార సందేశ మం
బుద మార్గంబునఁ దద్రసంబులు ధ్వనుల్ ముత్యాలువర్షించెడిన్
పదినూరేండ్ల పురాణ మేఘమనుచున్ భావింతువో నిత్యముం
బదియారేండ్ల వయస్సు కూర్పదె సుకావ్యస్పర్శ జేజెమ్మకున్.

జనముల్ మెచ్చు రసప్రసిద్ధమగు నా సందేశ భారంబుతో
జనముల్ సచ్చు విమానమాలికల గర్జాభీషణంబౌ ప్రభం
జన మార్గంబున నీప్రయాణమెటులన్ సాగించి నెగ్గించితో
చెనకన్నేరవు గండముల్ తబిసిపక్షీజన్మ సన్మార్గులన్. ౧౩

కన్నులు ధన్యంబులుగా
కన్నావే మంచుకొండ గగనము శిరముం
దన్నెడు దాని నమరగవి,
వెన్నవలెం ధవళరుచులు బిండెడుదానిన్. ౧౪

ఆకొండయే యిండియా విరోధులదండు
గుండె గాలంబైన వెండికోట
ఆకొండయే ముత్తియపుదండ భారతో
ర్వీమాతృమణికిఁ గిరీటభూష
ఆకొండయే పర్వతాగ్రగణ్యములైన
కులపర్వతమ్ముల నిక్కులకునిక్కు
ఆకొండయే రాజతాచలస్వామికి
మణిమయ కల్యాణ మంటపంబు

సింధు గంగా మహానదుల్ చిన్ననాడు
ప్రాకనేర్చిన యపరంజి ప్రస్తరములు
పాదచిహ్నాలు పరికించి వచ్చినావె
కలుషములు వాయ, కన్నుల కఱవుదీర! ౧౪

ఇంద్ర ధనువుబట్టి సాంద్రాబ్దవనవాటి
మెలగు చున్నవాడు మృగయుఁడొకఁడు
వాడు గొంతుబిసికి వసుధపై విసరిన
జంతుతతులు నిమ్నజాతి జనులు. ౧౫

ఆగర్భ ప్రతిభా సముద్రులగు శిల్పాచార్యు లూహింపగా
మూగంబడ్డ శకుంతముల్ పలికి గుంపుల్గట్టి కీర్తింపగా
వేగుంజామున రంగులద్దు నల శిల్పి బ్రహ్మ దేగ్రామమో
భోగట్టాగని వచ్చితే? రసమయంబుల్ తత్కళాపద్ధతుల్. ౧౭

బెళుకుంజూపులు గుల్కు పోకడలు చూపీచూపకూరించుచున్
జలదాగారములందు దోచెదరు కన్యల్ కొందరీక్షించితే
పులుగుంజేడియ యబ్ధిగర్భములలో ముత్యాలుపండించి భూ
ముల కర్పించెదరంట, మేటి గహనంబుల్ సృష్టివైచిత్ర్యముల్.

ఎంత కోయిలపాట వ్యధయయ్యెనో కదా!
    చిక్కుచీకటి వనసీమలందు,
ఎన్ని వెన్నెలవాగు లింకిపోయెనో కదా!
    కటికి కొండలమీద మిటకరించి,
ఎన్ని కస్తురిజింక లీడేరెనో కదా!
    మురికితిన్నెలమీద పరిమళించి,
ఎన్నిముత్తైపురాలు భిన్నమయ్యెనో కదా!
    పండిన వెదురు జొంపముల లోన,

ఎంత గంధవహన మెంత తంగెటిజున్ను
యెంత రత్నకాంతి యెంత శాంతి
ప్రకృతి గర్భమందు ! భగ్నమైపోయెనో
పుట్టరానిచోట బుట్టుకతన. ౧౯

నెలలోనున్నది వృద్ధురాలొకతె గాంధీ శిష్యురాల్నిచ్చలుం
జిలుగున్నూలు తయారుచేసికొనుచున్ జీవించు జేజెమ్మ, కొం
డలయల్లుండు శిరాననుంచుకొని సన్మానించెడిం బండువె
న్నెల పూదోటల విశ్రమించి మన సందేశంబు నాలించెనే.

నాచిత్తంబునదక్క తోచ దెచట న్మాతల్లిరూపంబు ధా
త్రీచక్రంబున, దేహమూడ్చి నరు లుర్విం బాసి వైకుంఠమం
దో! చండీశ్వరుడుండు మండలమునందో! యుందురం ద్రెళ్ళరా
యాచోకీగని వచ్చితే స్మృతి భవిష్యన్మార్గముల్ విశ్వముల్.

చంద్రచండకరులు సన్మార్గ గతులయ్యు
నొకనిజూచి యొక్కరోర్వజాల
"రెండు కింత వైర మిరువురిలో ద్రావి
డీ డెవండు ? తెల్గువా డెవండు ? ౨౨



G 2-2

పవలింపారెడు సృష్టిఁజీకటి సిరాపంకంబునంబుంపి యి
ట్లవమానించెడు కొంటెవాఁడెవఁడు ప్రొద్దల్లంత గన్పట్ట వే
కువ నేమూల నణంగియుండు తమ సిగ్గుంజేటు యోజింప రీ
యవివేకుల్, విరమింపరీ దినదిన వ్యర్థ ప్రయత్నంబులన్. ౨౩

శివుడు తాండవించి చేకొన్న సత్కీర్తి
తన ప్రయోజకత్వమని తలంచి
విఱ్ఱవీగడండ్రు – పెక్కురు నటకులు
విఱ్ఱవీగి కవుల విస్మరింత్రు. ౨౪

వెలవాక్రుచ్చఁగరాని భావముల నన్వేషించుచున్ సత్కవీం
ద్రులయూహల్ విహగంబులై తిరుగుచుండున్ బ్రోన్నతా
కాశమం
డలమస్తంబున నాకళించితె? ప్రయాణశ్రాంతి నమ్మించుకొం
డలకున్ డిగ్గెడి, నీవిశేషము రసజ్ఞజ్ఞేయ మూహింపఁగన్. ౨౫

వడుకునూలుచేత బగ్గాలు పేనించి
దొడ్డమృగయు డుచ్చు లొడ్డినాడు
తగులుకొనునొ! కాక తప్పించుకొనునొక్కొ
స్వీయరాజ్య మనెడు సింహారాజు. ౨౬

నరులన్ ముట్టక నందులం గొలిచి పుణ్యంబెల్ల సాధించు న
ప్పురమంబైన రహస్యమున్ శివునితో ప్రస్తావముం జేసి తే
పరమేశుం డివి నిమ్నజాతులకు సంప్రశ్నింపగా రాని వే
దరహస్యాలని కోపగించుకొని స్వార్థంబుం బ్రదర్శించెనే. ౨౭

బసుమంబు బూసికొని యే
రసికత లేకుండ బ్రదుకు ప్రమథుల నడుమన్
రసికుడగు సుకవి జీవిత
మసిధారావ్రతము వలన దది శత్రులకున్. ౨౮

ఎవరికివారై బ్రదుకుచు
నెవీన ధర్మములు పిచ్చి నమ్మకములతో
సవరించి ప్రజల తలలో
ప్రవేశ మొనరించు స్వార్థపరులంగంటే ? ౨౯

దిరుసుల్ మార్తురు కొందరాంధ్రులిలపురా, దేశాంతరంబేగి, వ
త్సరముల్ పుచ్చి, త్రివిష్టప ప్రజలతో సఖ్యంబుగావించి యె
బ్బెరికంబైన విదేశ నాగరకతో విచ్చేయ కచ్చాంధ్ర సుం
దరవేషంబు ప్రతిష్ఠనిల్పితివి సన్మానార్హ వెంతేనియున్. ౩౦

౫ శ్రీ ల మః

చెప్పక చెప్పుచున్నది విశేషము లేదని నీమొగంబు నే
తప్పొనరించి యింతటి వృధాశ్రమయిచ్చితి మాయదృష్టముల్
దప్పిన దప్పని మ్మనుగుతమ్ముల శ్రేయముగోరి భర్గునిన్
గుప్పెడు గుండెతో యెదురుకొంటి విదే పదివేలు పక్షిణీ! ౩౧

అపజయంబులు విజయ గేహంబు నిలుచు
స్తంభములు సుమ్మ నీకు విచారమేల
కొద్ది కొద్దిగ నిక్కిన గోడవోలె
సగము సగములుగా పనుల్ ముగిసిపోవు. ౩౨

ఓటమి లేదు నా యతన మూరకపోదు తుపానువోలె నా
మాట లుమా మహేశ్వరుల మానసముం గదలించితీరు, క
న్నీటమునింగి పైకుబుకు నిర్మలసూక్తి ఫలింపకున్నచో
రాటములో స్వరాజ్యము విరాజిలుటల్ కృతకప్రచారముల్.

పలనాటన్ మును బ్రహ్మనాయని కృపాబాహుళ్య నేత్రంబులో
పల నాటంబడి నాయురాలి కృతకవ్యాపారదావంబులో
పల భస్మంబయి సంఘసంస్కరణ దివ్యద్విజ, మీనాటికిం
ఫలియించెంగద? గాంధిచే, యతనముల్ వ్యర్థంబుగా వెన్నడున్

నీకావించిన రాయబారమునకు న్నిత్యాభిషేకంబుగా
నాకన్నీటిని కాన్కఁగా యొసగుచున్నానో దయాశాలినీ !
చేకొమ్మింతకుమించి నావలన నాశింపంగ లేదిట్టి నీ
బాకీదీర్తు స్వరాజ్య సౌధమున నావాసంబుసిద్ధించినన్. ౩౫

ఏజాతి కెంతవచ్చునో
రాజత్వంబంత నాకు రావచ్చుగదా ?
నాజాతి యెత్తు కేతన
రాజంబున నీదుమూర్తి వ్రాయింతుఁజెలీ ! ౩౬

పెల్లుతమస్సులోన దురపిల్లెడు మాబ్రతుకుం దమస్వినుల్
భల్లున దెల్లవార్చగల బాబులు పెద్దలనేకు లుండగా
దెల్లనివేల్పు భిక్షుకుని దిండికి బట్టకు లేని కొండరా,
యల్లుని నాశ్రయించి యకృతార్థుడనైతిని పిచ్చివాడనై. ౩౭

మరచితి నాదిదేవుని సమానుఁడు బుద్ధునియంతవాఁడు భా
సురదరహాస చంద్రికల శుభ్రత లోన గలట్టివాఁడు, య
ద్దొరలకుగాదు వారిచెవిదూరినవారిని లక్ష్యపెట్టఁ డ
ప్పరమమునిన్ సబర్మతి నివాసిని జూచితివే తపస్వినీ ! ౩౮

ముల్లోక్కించుక వాలిపోయినను బాపూజీకి దీక్షైన శ్రీ
వల్లాభాయి పటేలు దర్శనము సంప్రాప్తించెనే నీకు నే
డల్లంతన్ గనుపట్టుచుండెడు స్వరాజ్యార్థంబు సర్వస్వముం
గొల్లంబెట్టిన త్యాగి తానతని వెలుంగున్ నా మనఃక్లేశమున్.

ధిక్కారించెడు రాచగుజ్జముల స్వాధీనంబు గావింపగా
యుక్కుంగళ్లెము జవ్హారుం డతని విద్యుచ్ఛారదామూర్తి న
ల్దిక్కుల్ నిండి నటించుచున్నదనుచున్ దేశంబు లగ్గించు మా
చిక్కుల్ దీర్చుట విస్మరింపదుగదా? స్వేచ్ఛాజయాంతంబునన్.

పసుపుం బచ్చని పూతపూచినది మువ్వన్నెల్ పిసాళింపఁ గాం
గ్రెసు మందారమనంతశాఖకలు నిక్కన్ దిగ్దిగంతంబులన్
బసలేర్పడ్డవి సర్వవర్ణములకున్ దచ్ఛాఖశాఖాతతిన్
వసియింపన్ మనకుండదే స్థలము దివ్యన్మౌని పక్షీశ్వరీ! ౭౧

కల డంబేత్కరు నా సహోదరుడు మాకై యష్టకష్టాలకుం
బలియై, సీమకుపోయి క్రమ్మరిన విద్వాంసుండు వైస్రాయిమే
ల్కొలవందుంగల దొడ్డవాఁడతఁడు నీకున్ స్వాగతంబిచ్చి పూ
వుల పూజల్ పొనరించెనే యతని మెప్పుల్ నీజయారంభముల్.

నేను నా కను సహము ఖండింప లేక
పదియు నెనిమిదిశాస్త్రిలు పదునులుడిగె,
నీవు నే నను సమత సంధింపగలిగె
తీవ్రతరమైన చిన్న మౌనవ్రతంబు. ౮౩

వచ్చినవారు సీమనరపాలురమంత్రు లభీప్సితార్థముల్
దెచ్చిరి ప్రేమతో భరతదేశజులం దనియింపవచ్చి పో
వచ్చు, స్వతంత్రభారత సువర్ణకిరీటము, నేడుగాక రా
వచ్చు మరొక్కనాడు నెలవాసినతో యిల్యాలి తీర్థమాడదే? ౮౪

గుడిలో దేవుడు చూచిపొమ్మనుచు నాకుణ్వార్తలంపింపగా
దొడగెన్ నల్వురచేత నీవెనుకవత్తున్ నన్ను రమ్మందువా?
తడవైనన్ మరణింతురెందరొ విముక్తాహార దీక్షాపరుల్
నడుమన్, నేనుసహింపజాల నొకయాంధ్రప్రాణి శుష్కిం
చినన్. ౮౫

గబ్బలమవయ్యు శివుని లోకంబునందు
వలయుకదలిక గలిగించి వచ్చినావు
నిశ్చలంబైన కాసార నీరమునను
నలతి శిల చాలదే వలయములుదీర్ప. ౮౬

గద్యము

అర్థించి చనుదెంతు నగ్రహారముకన్న
సర్వేశ్వరుని యింటి చౌకదనము
అడిగివచ్చెద వీటి నడిబజారునకన్న
గుడిగోపురముల తక్కువతనంబు
పలికించికొనివత్తు బంతిబువ్వలకన్న
తీర్థప్రసాదాల దేబెతనము
ప్రశ్నించివత్తును రాచబావులకన్న
పాతాళగంగమ్మ పలుచదనము

నిజము దేలిచికొనివత్తు నిన్న నేడు
నన్నుజూచిన నల్లంత నడుచుతనము
గుడికిరమ్మనినంతనే యొడలుమఱచి
పరుగులెత్తుట నాకంత పరువుగాదు. ౪౭

ఎంతోదూరము పోవనేమిటికి నేడింటింటికిం బ్రాకి యా
శాంత వ్యాప్తముగా రహించెడు స్వరాజ్యస్వర్ణసూత్రంబు, చౌ
దంతి స్తంభన మాచరించెగద? యేతద్దివ్యసూత్రంబు, మో
కంత్రై నిక్కనకట్టివేయగలదా యస్పృశ్యతావ్యాఘ్రమున్. ౪౮

చాటింపించి మదీయజాతికి నభీష్టంబుల్ ప్రసాదింపగా
పూటాపడ్డది కొంతభారతము, రేపో! మాపొ! రావచ్చు, నీ
నాటంగాదని కొంతభారతము పంతంబూప్ప వాదించు నీ
వోలెవ్వారి కొసంగితో తెలిపి నన్నోదార్పవే నెచ్చెలీ! ౪౯

ప్రియములుగాని సత్యములు పెక్కులునేను వచించుచుంటి, నీ
దయకెడమై తపింతునో! యథార్థ పిపాసువులైనవారి య
వ్యయ కరుణావిశేష రుచిరాత్త మనస్కుడనై సుఖింతునో
భయపడనేల నాపలుకుపల్కులు బాష్పకణాభిరామముల్. ౫౦

ఏకవి పిచ్చిగానడుచు పృథ్వికిలోబడి కీర్తికోస ము
ద్రేకమె సంహరించుకొని దేశమువోయిన త్రోవబోవునో
ఆకవి పేదమూతి మగ డంబుజగర్భుని రాణిగ్గారికిన్
సాకుడుబిడ్డ డాస్తిగల సామికి బేరసికప్రదాతకున్. ౫౧

పుట్టంగావలె సత్కవీశ్వరుడు నీ పుణ్యాన మావంశపుం
బుట్టంజీలిచికొంచు సంచితకళా పూర్ణప్రభారాశియై
పుట్టంగూడదు పుట్టినం గలుగవెప్డున్ నిందుసన్మానముల్
గట్టా! యుచ్చతనీచతాయుత వితర్కభ్రష్ట దేశంబునన్. ౫౨

పిడికెండన్నము బెట్టలేడప్పుడు మా వేమన్న జీవించి న
ష్టుడు ముద్దుల్ మురిపింపు మేలికవనంపుం బుగ్గలుప్పొంగి కా
అడవుల్ ముద్దులు మోసులెత్తునప్పుడౌరా! నేడు గోరీపయిన్
నడచుంబూజలుపుణ్యకార్యములువింతల్ మాదయాధర్మముల్

బ్రతికియున్న సాయబా బెన్నడును గాడు
చావకున్న వట్టి సాయబయ్యా
తిరుమలేశుడైన తెలియడీ యర్థంబు
చావు బ్రతుకులోని సారమిదియ. ౫౪

సమతలు సఖ్యముల్ బెదవిజారినమాటలు కట్టుబాట్లు చ
ట్టములు పటుత్వమూడిన గుడారపుదూముడి బంధనాలి ధ
ర్మములు దయారసాల్ మొసలిరాలుచు నశ్రుకణాలు చిత్రచి
త్రములు మతస్వభావము లురామరగా వివరింప గల్గితిన్. ౫౫

ఇప్పుడు గుండురాతివలె నీశ్వరుడై ముడుపుల్ గ్రహించు కో
టప్ప యొకానొకప్పుడు గృహస్థుడు మానవమాత్రుడైన రాల్
రప్పలు వేల్పులై సకలరాసులు మ్రింగక మిన్నకుండునే
యప్ప! పులుంగురాణి! యిక నాసలు లేవు క్షుధార్తజాతికిన్.

మరణము వార్ధకంబను ప్రమాదమెఱుంగని కైతలల్లు న
బ్బురపుఁ గవీంద్రు రెడ్డికులముఖ్యుని వేమన చాకచక్యమున్
మరచి పురాణకావ్యరసమత్తుడు వీరుడు సంఘసంస్కృతి
స్థిరుడు రచించె నాంధ్రకవిజీవితముల్ బొరపాటుచేయుచున్ ౫౭

దొడ్డరాళ్లగుండ్లు దొరలించి పతితల
బెదురుబెట్టు కవితవిస్తరించి
పండితులకుదక్క పరులకందకపోయె
దేవతలకు కామధేనువట్లు. ౫౮

కవిత చచ్చుదయ్యు, గథ పేరుగలదైన
గవికి కొంతకీర్తి గలుగవచ్చు
నెలలు తక్కువైన బలమైనతిండిచే
నుసురునిల్పుకొన్న నిసుగువోలె. ౫౯

వ్యాకరణశాస్త్రకారులు
తూకుఁ గకారంబు విరతిగన్పడదని చీ
కాకుపరతు రంతెకాని
పాకము రసమింపుసొంపుఁ బరికించెదరే. ౬౦

వ్యవహారంబున భ్రష్టమయ్యు రసభావస్ఫూర్తిగల్పించు మా
ర్దవముల్ శబ్దములెన్నియో కలుగ శాస్త్రజ్ఞానమాత్రుల్ పురా
కవితోన్మత్తు లెఱుంగజాలుదురె కుగ్రామీణభాషాబ్ధిలో
జవులూరించు తెలుంగుపల్కుల జగాస్వారస్యరాహస్యమున్

కనుగొన్నావుగదమ్మ కృష్ణవిభు డక్కాలాన భాషావనం
బునసాగించిన యష్టదిగ్గజరథంబున్ శారదావాహమున్
తెనుగుందేశము విస్మరించినది తద్దిగ్దంతి దంతావళ
ధ్వని, యధ్వానపుటద్రిగర్భముల నిద్రంబోవునాంధ్రత్వమున్.

తెల్గుతేజంబెల్ల దిక్కులకెగబ్రాకి
పగవాని బెదిరించి వచ్చునపుడు
తెలుగుశిల్పుల సుత్తెదెబ్బ ఖంగునమోసి
చీనాకుపయనంబు సేయునపుడు
తెలుగుకవిత్వంబు దిగ్దంతులముఖాన
బృంహితధ్వనులు గావించునపుడు
తెలుగుజెండాశక్తి నలుదెసల్ ప్రసరించి
విద్యానగరవీథి వెలుగునపుడు

రామలింగనిహాస్య కార్యములు దలచి
నాల్గుదిక్కులు కడుపుబ్బ నవ్వునపుడు
నాట్యమాడిన యానందనవ్యలక్ష్మి
కానుపించెనె ? శిథిలదుర్గముల యందు. ౬౩

అక్కట! తల్లికోట సమరాంగన యాఖరు తెల్గుపోటుచే
యుక్కిరి బిక్కిరై తురకయోధులవంకకు వాలునాడు భూ
భుక్కులగండడౌ తెలుగుభోజుని ప్రాజలు చూరగొన్న యా
టక్కరిదేవతల్ తనువు డాచుట నాకు నసహ్య మయ్యెడిన్.

తొంబదియేండ్లవృద్ధుడతి దోర్బల భీముడు రామరాజు డెం
తెం బరగండడౌ నృపమణీ సుత భర్త, మహమ్మదీయ ఖ
డ్గంబులకున్ శిరంబొసగి కష్టముదెచ్చినమాట ఆంధ్రవ
ర్గంబు సహింపనేరని పరాభవమై భవమై దహించెడిన్. ౬౪

తెలుగులండను నగరంబు తెలుగుకోట
తెలుగుకవి దిగ్గజంబులు, తెలుగుదనము
పొట్టిగుఱ్ఱము నెక్కిన పొగరుబోతు
టళియరామునికతన, ముక్కలయిపోయె. ౬౬

విహరింపనేభీతి విడిచి మ_స్తముని_త్తి
సకల సా(మ్రాజ్యమహా సభలలోన
వాక్రుచ్చ నేరాలు వగిలి బుగ్గలుజిమ్మ
నతి నిశాత(ప్రబంధాదికములు
కల్పింప నే తెల్గు కళ్యాణికొప్పున
సొగసైన కీరితి పొగడదండ
ఎ_త్తింపనేమేటి హిమవద్గిరులమీద
శాశ్వత విజయ రాష్ట్రీధ్వజంబు

పగరగర్భకుహారిస్ఫారిగావింప నే
యింటి గుట్టు బయటి కెక్కకున్న
సమ్మతించి జాతి కుమ్మక్కుగానున్న
కొండలన్ని పిండి గొట్టనొక్కొ. ౬౭

అది మారత్నము లారబోసికొను విద్యాశారదాపీఠ మ
ల్లది మా కత్తుల ఖారుకానమది యాంధ్రాదిత్యబింబంబు సం
పద సొంపారిన మాల్యవంతమని డంబంబొప్ప చాటించు స
మ్మదసౌఖ్యంబొక తెల్గువీరునకె సంప్రాప్తించె ముమ్మాటికిన్.

కలవెన్నోవిషయంబు లాంధ్రుల కళాకౌశల్యముల్ సాటు తా
వులు ప్రత్యర్థులగుండెలో వెఱపు నిప్పుల్ సల్లు గాథావళుల్
కలవిప్డున్ బలనాటిపౌరుషపు రేఖల్ మాశరీరంబులన్
కలుపుంగోలుతనంబు లే దది కళంకంబంద్రు మాజాతికిన్. ౬౯

ముసలిమానులలోని యసమసమత్వంబు
లంగోటిగట్టి చెలంగుచుండ
ఘూర్కాసిపాయీల కుటిలశౌర్యజ్వాల
నట్టింట కాపలానడుపుచుండ
ద్రవిడుల కార్య సాధన, ధనార్జనదీక్ష,
సాంబారునోరెత్తి చాటుచుండ
రాష్ట్రాంతరములకు బ్రాకి హిందీభాష
పదుగురినోళ్ళలో నెదుగుచుండ

అఖిలదేశములకు నవతంస కుసుమంబు
రాజితోగ్ర కదనరక్తతిలక
మాన ధనికులాలు, మా తెల్గుటిల్లాలు
కలత జెందవార కాలమహిమ!

గబ్బిలము

గౌతమి గంగలోన మృతకాంతులతో నుదయంబుగన్న వి
ఖ్యాత మణీ వితానము మహమ్మదురాజుల దండుదెబ్బతో
తాతలనాడ పోయె నిక తాతలుబుట్టినరావు, రత్న దీ
పాతత కాంతులీను గృహమక్కట నూనెకు దేబెరించెనే.

రతనాల్ దొంగలు దోచుకున్నపుడు శౌర్యశ్రీలు విద్రోహిభూ
పతులేచేట మృదూక్తి చాతురులచే బంధించునాడేని, భా
రత చండీశ్వరి కోటిహస్తముల దర్పంబుం బ్రదర్శింపదో!
ధృతిహీనంబగు భిన్న భిన్న మత విద్వేషంబు పాటించెనో

గప్పాల్గొట్టిన నేమిలాభము ధరా గర్భాన నిద్రించు కృ
ష్ణప్పల్ దాతలు లేచివచ్చెదరె వీరావేశ విభ్రాజితుల్,
నిప్పంబోలు తెలుంగువీరు లిపుడున్ జీవించియున్నారర లీ
చప్పంబడ్డ యనుంగు సోదరుల కుత్సాహంబు సంధింపగన్

ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వ
విశ్వసత్యము నాలపింప గలదొ!
ఏనాడు మా జాతి దృష్టి మాంద్యమువాసి
చుట్టుపక్కల దేరి చూడగలదొ!

ఏనాడు మా బుజ్జి లీ జుట్టు తలలేని
పుక్కిటి కథలలో జిక్కువడవా
ఏనాడు మా విద్య లిసుపసంఘమునందు
చిలుముపట్టక ప్రకాశింపగలవా

తనువుదాచక సోమరితనముమాని
యెన్నడీమతంబులు బిచ్చమెత్తుకొనవా
అట్టిశుభవేళకై కొంగుబట్టి నిలచి
నలిగి వాపోవుచున్నది నామనస్సు. ౨౫

ప్రభువుల పెండ్లి పేరంటాలు వర్ణించి.
కాలంబు పెక్కేండ్లు ఖర్చుపెట్టి
విరహావేదన మేనుమరచి మూర్ఛలువోవు
రాణివాసంబును రచ్చకీడ్చి
అంగాంగ వర్ణనా వ్యసనంబు రెట్టింప
యువకజీవిత కోటి కుచ్చులొడ్డి
పదియునెన్మిది మార్లు బాడిన శ్రీరాము
చరితంబు వగరెక్క తిరుగబాడి

శరణు శరణటంచు బరుగులెత్తుచు వచ్చు
నార్తలోకరుత మనాదరించి
భువన హితముగోరు కవితాకళా శక్తి
స్వార్థజలధి నూరవైచినారు. ౭౫

పెద్దలశల్యముల్ బలె వివేకము సంగని గ్రంథరాసులే
విద్దియలైన నింక బదివేలయుగాల్దలకాయలేని గం
గెద్దులు బుట్టి స్వార్థపరులెత్తిన గంతలుమోసి తీరెడిన్
బుద్ధి చిగుర్చునే యరుచి బుట్టుకథల్ దలమీదరుద్దినన్. ౭౬

ఆడుది లేకయున్న గృతికందము లేదని నమ్మి యెన్నడో
పాడి రసుత్తమ ప్రణయ బంధురగీతము లర్థతృష్ణ వె
న్నాడకవుల్, మహీపతి బృహన్నల వర్గము సంతసింప, నీ
నాడు రచింతు, రిద్ధకరుణాపరిణద్ధ రసప్రబంధముల్. ౭౭

మొన్నటియుద్ధదేవతకు బుట్టినకూతురు క్షామదేవి మృ
ష్టాన్నముగా భుజించిన క్షుధార్తుల డొక్కలు శల్యరాశి, పం
పన్నుల వీథులందు గనుపట్టెనె? వంగకవీంద్రకోటి చే
కొన్నకలాలెఱుంగవనుకొందు దయారస నవ్యకాయముల్. ౭౮

చలి-చీమం బొలియింపనేరని యహింసానిమగ్నుల్ జాలలో
మొలిపించెం బహుబుద్ధవిగ్రహచయంబుం భారతం బంతటన్
కల్లయైపోయెనో తత్కృపాగుణము బంగాళంబులోఁ బ్రేమమూ
ర్తులు లేరో: భుజియింపరో ద్రవిణవంతుల్ మేలిమృష్టాన్నమున్.

ఎట్టునశించిపోయె నితరేతర విశ్వసనంబు లెందుకీ
చట్టములుం బ్రమాణము లసార మషీరస పత్రలేశముల్
కొట్టినగొట్టుమం చెడిరి గుండియలం గరగించు ధర్మముల్
బుట్టినగడ్డలో నకట ఫూత్కృతిసల్పు నశాంతిసర్పముల్.

అనఘుం డశ్రు మషీజలంబున వివేకానంద సన్న్యాసి, వ్రా
సినవ్రాతల్ దడియారలే దిపుడు ప్రాచీనంపు టజ్ఞాన బం
ధన విచ్ఛేదమొనర్చి యే ఘనుడు విద్యాభిక్షగావించి, ప
చ్చని బంగారమువంటి మా భరతసంసారంబు నెగ్గించునో!

గాలిందూలెడు శుష్క-దేహములతో కాషాయవస్త్రాలతో
శూలంబుల్ సొరకాయబుఱ్ఱలు జటాజూటంబులుందాల్చి యా
మూలాగ్రంబుగ భ్రష్టులైతిరుగు బాబుల్ దొడ్డ గంజాయి భా
యీ లున్నా రెదురైనవారె మునిపక్షీ! కుక్షిరక్షాపరుల్. ౮౨

జపమో ధ్యానమొ! యభ్యసించి యతివేషంబూని క్రీడించుమో
సపు బార్థుల్ ప్రతి పల్లెటూర గలరీ సన్యాసి వర్గంబు నీ
కుపదేశింపదొ! యిష్టసిద్ధికని మాయోపాయ మంత్రంబు, భ
క్తిపరత్వం బాక సాధనం బిహ పరస్త్రీవంచక శ్రేణికిన్. ౮౩

పాలుంబండులు, కందమూలములుమా భక్ష్యాన్నముల్ గోరమే
కాలం బన్యపదార్థముల్ రజతమో బంగారమో కొద్దిగా
జాలున్ మాకని సేకరించెదరు గోసాయీ లుపాయాలు మో
సా లెన్నేని నిరంతరాయముగ రాజ్యంబేలు నేడెల్లెడన్. ౮౪

వృత్తుల్ సర్వము తప్పవట్టి చనగా భిక్షాటనంబుల్ జగా
వృత్తుల్ గా, పలుజాతులై నిలువ దుర్భిక్షంబు రాకుండునే
యుత్తుంగాశయు లెందరోకలరు దేశోద్ధారకుల్ పూనరీ
చిత్తంబేర్చు కళంకమున్ దుడిచి సుశ్రీనేలకుం గూర్పగన్. ౮౫

ఎన్ని సుక్షేత్రములు సార మిగిరిపోయి
ముండ్లతుప్పల బంజరభూములయ్యె
దృఢతరంబైన యెంతెంత దేహశక్తి
భిక్షుకులమైన జీర్ణించి పృథివి గలిసె. ౮౬

పదవులు పీటలెక్కి యనువారము లంచపు బాడిబట్టెలం
బిదికి గడించి కార్మికుల పేదల చెమ్మట దెచ్చి కానుక లి
చ్చెదరు పరోపజీవులు విచిత్రపు భక్తులు వేషధార్లు నీ
కెదురయివచ్చిరే వలదిసీ చెయిసాచకుమమ్మ పక్షిణీ! ౮౭

నరునికష్టపెట్టి నారాయణునిగొల్చు
ధర్మశీలురున్న ధరణిమీద
కాలుమోపలేక గబ్బిలమొక్కటే
చరణయుగళి దివికి సాచి నడచు.

పూంజారి బోషాణమును కాపలాకాయు
చిల్లరి వేల్పుల సేవజేసి
గొఱ్ఱెపోతులనల్ల జుట్టి గట్టున దేచు
కరకు సత్తులకు జాతరలు సల్పి
ఏ శేటపెండ్లి జేయించుకొంచుదయించు
కృతకరాముల పల్లకీలుమోసి
నిలువుదోపిడి జేసి తల కాయగొరిగించు
యేడుకొండలవాని మేడలెక్కి

అంబుధీశుని కళ్యాణులని తలంచి
ముంచుగంగమ్మలకు డబ్బుపోసి పోసి
పాతకమువోలె నావెన్ను వ్రాయకున్న
గోచితో నిల్చియున్నాడ పేచకంబ.

గుఱ్ఱాలకు ఱెక్కలుగల
వెట్టియుగాల్ దాటిపోయె, విజ్ఞానంబున్
బుఱ్ఱగల గాంధియుగమిది
కఱ్ఱలు ఖడ్గంబు లేలగా లేవు ప్రజకు. ౯౦

రాజుగారిగుఱ్ఱాల రథచక్రములక్రింద
మరణించు రైతుకు శరణమిచ్చి
నరజాతిలో, ననంతరములుండుటకన్న
నఘము లేదను ధర్మమాకళించి
బహుమతాచార దుర్భర పదాహతిజేసి
అసురుసురగువారి కభయమిచ్చి
రాజభాషలకన్న రాష్ట్రభాషలలోన
రసమున్నదను యథార్థత నెఱింగి

యుగయుగాలనాడ యూబిలోదిగబడ్డ
మహితమైనజాతి మత్తగజము
ప్రబలదాస్య నిగళబంధంబు లగలించి
దెసల మసలుచున్న దినములివ్వి! ౯౧

కలరే మోసపుదేశభక్తి పరులక్కైలాస దేశంబునన్
చలికిం ఖద్దరుధారులై యవల స్వేచ్ఛారాజ్యభాగంబు రా
గలదంచున్ విహరించు పెద్దలు? పతంగస్వామినీ! నిమ్నజా
తులపై వీరు వెలార్చు బాష్పములుచిందున్ దియ్యగాపుల్లగా!

మా దౌర్భాగ్యపుజాతిలోన నొకనిం బాధింపకున్నట్టి యీ
యాదివ్యాధికి నగ్నమైకములు ఏలా! నాకుం బోనిమ్ము నా
చేద స్తంబిది కష్టపెట్టితిని పక్షీ! రోషగాడెన్నడున్
బ్రాదుర్భావమునందరాదు పరసేవాభ్రష్ట వంశంబునన్. ౯౩

కలదమ్మా వ్రణమంటరానితన మాకర్ణింపుమీ యిండియా
పొలమందుంగల మాలమాదిగలకున్ భూతేశుడేకాదు కృ
ష్ణులు, కృష్ణున్నిరసించు దైవములు క్రీస్తుల్, మస్తుగాబుట్టినన్
కలుపన్నేరరు రెండుజాతులను వక్కాణింప సిగ్గయ్యెడిన్. ౯౪

చాకిరి జేసితిం దెలుగుజాతికి నేబదివత్సరాలు నా
వాకిలి ద్రొక్కి-చూడవు శుభంబులుసౌఖ్యము లెంతకాల మీ
బాకి, వయస్సుతో నడుగుబట్టిన యాసలు తెప్పరిల్లునో
లేక, నశించునో, తెలుప లేదుగదా మదనాగవైరియున్. ౯౫

శుభశిశువో! యదిగాక య
శుభశిశువో తెలియరాదు క్షోణీసతికిన్
బ్రభవించు బిడ్డ యకటా
యభంగుర ప్రసవబాధ కగ్గంబయ్యెన్ ౯౬

అరవంగుత్తుకగోసి జంతువుల గర్భాగారముల్ జీల్చి నె
త్తురు వ్రేళ్లన్నటియించు మూఢతమజాతుల్ జాతరల్ సేయ, జూ
తురు, చూపింతురు ప్రోత్సహింత్రు తతివాదుల్ శాస్త్రపారంగతుల్
కరుణాల్ కమ్మనిబోధలో ఫులుగుటక్కా! ఛీ! హుళక్కుల్ గదా?

కని గంగార్పణమంచు ద్రోసిచనియెం గర్ణున్ బృథాదేవి, యా
తని విద్యా కులరూప సంపదలు వ్యర్థంబై ప్రలాపింపవో
కనియెన్ భారతకుంతి మమ్ముల నసంఖ్యాకంబుగా కర్ణులన్
మునిపక్షీ! యమనందనుల్ తెలియరిప్డున్ మాదుభ్రాతృత్వమున్.

ఒకడు రుద్రాక్షమాలికలు నెత్తికిజుట్టి
శివమూర్తియై భూమికవతరించు
ఒకడూర్ధ్వపుండ్రంబు లురువుగా దగిలించి
శివలింగమునుజూచి చీదరించు
ఒకడు రెండునుగాని వికటవేషముదాల్చి
పైవారిమీద సవాలుసేయు,
ఒకడు గంజాయిదమ్ముకు దాసుడైపోయి,
బూడిదగురవడై పుట్టివచ్చు

మనుజులార మాది ఘనమైన మతమని
ఒకడు తఱిమితరిమి యుగ్గడించు
పెక్కుమతములిట్లు పేచీలు సాగింప
మార్గమేది యైకమత్యమునకు. ౯౯

మొక్కుబళ్ళ నెపాన చక్కని పసిపాప
లెందరు గంగలో నిమిడినారొ
సహగమనాచార దహనదేవత లెన్ని
చిగురుగొమ్మల బూదిజేసెనొక్కొ

చదువుదాచెడు దురాచరణమెందరి కళా
భ్యసనచాతురి గొంతుబిసికెనొక్కొ
పొందెఱుంగని వేరుబందాలచే బాహు
బలమెంతగా చచ్చువడియెనొక్కొ

చిలిపిరాలకు నగిషీలు చెక్కి చెక్కి
కాలమెంత యగంతాన గలిపిరొక్కొ
చదువనేర్చిన వెఱ్ఱిని జంపగలరె?
ఒక్కబుద్ధు డొకక్రీస్తు! ఒక్కగాంధి! ౧౦౦

శిలవంటి యూరిసత్తులకు నెత్తుటికూడు
రేపులుమాపులు మేపలేక
'ఆచారమని! తప్పదని' వెంటబడివచ్చు
గురులదక్షిణ లిచ్చుకొనగలేక
మంత్రతంత్రముల సోమరిమాంత్రికుల బారి
బడి ధైర్యమును చిక్కబట్టలేక
శతసహస్ర క్రూరమత సింహములు సేయు
కుటిలగర్జకు తట్టుకొనగలేక

అనుగు తమ్ముల సిరు లోర్చుకొనగ లేక
పిచ్చిపూజల మమతలు విడువలేక
అమరనుతమైన మాదు దేశాభ్యుదయము
యుట్టికిని స్వర్గమునకెక్క కూగులాడు. ౧౦౧

విందుభుజించి పొమ్మనుచు బిల్చుటకర్హత లేదునాకు క
ర్మంది పతంగినీ! పనికిమాలిన సంఘము సమ్మతించునే
పొందులు పొత్తులు న్మనకు ముప్పదినూర్ల కులాలవారికిన్
నందుల నాగులంగొలిచి నవ్వులపాలగుచున్న జాతికిన్. ౧౦౨

స్వాయముగ నన్నపూర్ణ తనభర్తకు సిద్ధము జేసియున్న య
వ్యయుచిరాన్నమున్ శివునిపంక్తిభుజించిన పూజ్యురాల! వ
న్వాయము తరించె నిట్టి మునిపత్షిణిపై, కులభేదబుద్ధిచే
కయికొనకుందువే సఖుల గర్భదరిద్రులయాతిథేయముల్. ౧౦౩

తులవాక్రుచ్చగరాని నెత్తుటిసిరాతో వ్రాయుచున్నారు మ
త్కులజుల్ దుఃఖరసోత్కటంబులగు పెక్కుల్ గావ్యముల్ జాతి లు
బ్ధుల వజ్రస్థిరచిత్తముల్ గరగి, సంతోషించునో, యీప్సితం
బులు పండింపక సుంకుతో సమసిమామూల్ తోవలంద్రొక్కునో!

కవిగారికిదె నమస్కారంబనెడు వాడు
కళకు లెమ్మని పరోక్షమునబలుకు
కవనంబునకు మేను గరగి మెచ్చినవాడు
కవిచెంత నెఱబెఱికముగ మసలు
విద్యాకళంకంబు వెదకజాలనివాడు
జాతిలేదని నోరు చప్పరించు
శాస్త్రియులకు సహస్రములు బోసినదాత
అన్యుల మధుర వాక్యములదనుపు

జీవకళలు చెక్కు శిల్పిని నిరసించి
శిల్పమునకు పూజసేయునట్టి
వక్ర చరితులైన వ్యక్తులు గలచోట
కళలకకట! ప్రేత కళలగతులు. ౧౦౫

పోటీసేయ సమర్థులయ్యెదరె మా ముక్కన్న తిక్కన్నతో
మేటుల్ షేకుసుపీయరుల్ బయిరనుల్ మిల్టన్లు గోల్డుస్మితుల్
నాకైనారు స్వకీయులైన కవు లీనాడన్యభాషాకవుల్
నేడై రక్కట! కాలమాంత్రికుని పాండిత్యప్రభావంబునన్

జాతీయోద్యమ యుద్ధరంగ మహితోత్సాహ ప్రతిధ్వానముల్
కూతల్ బెట్టుచు నాల్గుజాతులకు గగ్గుర్పాటు గల్పించెడిన్
స్వాతంత్ర్యంబను స్వర్గసౌఖ్యమున మా భాగంబు మాకిత్తురో
ఖాతాలేదని త్రోసిపుచ్చెదరొ! వక్కాణింపవే చెల్లెలా! ౧౦౮

కలధౌతాద్రిగుహల్ ప్రతిధ్వనులెసంగన్ దెల్గు రాష్ట్రార్థమై
గలభా రేచిరి సోదరాంధ్రజను లాకర్ణింపవో నీవు? చె
ల్లెల! రాష్ట్రంబు గడించినారనుచు హాళిందేలితో! తెల్గు బి
డ్డల యత్నాలనరాదుగాని యవి సోడాబుడ్డి యుద్రేకముల్

బలియైనాడు ధరాహితార్థము మహాభాగుండు యేసుండు త
త్ఫలితంబై కనుపట్టు భిన్నమత సిద్ధాంతంబులుం జీలికల్
కులముల్ గుట్రలనైకమత్యములు చిక్కుల్ జీదరల్, రిత్తబో
ధలు వేదాలు పదాలురాల్ప వరచేతన్ముక్తి ముక్తామణిన్.

భోగు లాహారించు భుక్తికన్నులజూచి
పరమపేదలు దుఃఖపడనిచోటు
సాంఘికాచార పంచాస్యగర్జనమున
బెదరక జ్ఞానంబు పెరుగుచోటు

జాతివైషమ్య రాక్షస పదాహతిఁజేసి
కందకకళలు వెంపొందుచోటు
పరిపాలక క్రూరతగ కరాసికి లొంగి
పోక స్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు

అనదబిడ్డలుజూడ నెయ్యంపుసుతుల
ముద్దులాడని గుణనిధుల్ బుట్టుచోటు
చెప్పఁగదవమ్మ చూచివచ్చితివె నీవు
నిశ్చయంబుగ వాసముండెదను నేను. ౧౧౦

పయిపైనవ్వులు పల్కరింపులు మృషాబాంధముల్ సూపి యా
పయిశత్రుత్వము సేయు నాగరకతా భ్రష్టస్వభావాధముల్
సయితానుల్ చరియింపనట్టి ధర గోష్పాదంబు గన్పట్టినన్
దయతో నాకెఱిగింపుమమ్మ యచటన్ న్నాయిల్లు గట్టించెదన్

కళలందాచెడు చుప్పనాతితనమింకం దేశమందున్నచో
కలదే ముక్తి, ప్రపంచసభ్యతకు మార్గంబుంచునే జాతికిన్
తలయుం తోకయులేని తొంబది సమాధానంబులం జెప్పి పే
దలవంచించు కళానిహంతలె యనర్గంబీ శుభక్షోణికిన్.

అసుశక్తిం బనిసేయుచున్ మసలు దేహాపూర్వయంత్రంబులో
బిసలెన్నోకల వే నెఱుంగనివి నా విజ్ఞాన భాండారపుం
బసలెల్లం బనిసేయ విందలిమరల్ పాడైనచో, యెవ్వడీ
బిసగాడెందుల కీ రహస్యములకున్ బీగంబు బంధించెనో.

అచ్చెరువున్ ఘటింపగల యంత్రములం గనుగొన్న జ్ఞానులుం
జచ్చిరి చావుపుట్టువుల జాడ లెఱుంగ కెటింగి దేవతల్
జచ్చిరి మృత్యువుం గెలుచు శక్తు లొసంగని చుప్పనాతి వే
ల్పెచ్చట డాగినాఁ డతని కెందుల కీ తెరచాటు మోసముల్

మును మేనూడ్చిన వారియెమ్ములెరువై భూదేవి పండించి నిం
చిన నానా ఫలవృక్షరాజముల కిచ్చెన్ దివ్య మాధుర్యమున్
తను రక్తంబును మేఘమై కురిసి యానందంబు గల్పించు చ
చ్చున దేదీ? ప్రతిజీవియుం దిరిగి వచ్చుం భిన్న రూపంబులన్.

మరణితులైన వారి తనుమాంసము కొన్నియుగాలు భూమిలో
మురిగి రసాయనప్లుతుల పూర్ణ పరీక్షల నిగ్గు దేలి యా
ఖరుకు, శిశూత్కరాదులకు గాయముగా విలసిల్లకున్న నీ
సురుచిర దివ్యకాంతులు నిసుంగులు మేన రహింప నేటికిన్.

గబ్బిలము

ఆజన్మంబు తపంబునం బెరిగి దేవావాస వాస్తవ్యవై
పూజాపద్ధతులెల్ల నేర్చితివి, నీ ముత్తాతలుం దాతలున్
జేజేమ్మల్ కులసంఘ బాహ్యులయి కష్టింగుందుచో దేవతల్
రాజీపెట్టిరె? పేదవారి మొర కర్ణక్లేశ మెవ్వారికిన్.

మాతృభాషల కర్హ మర్యాద లొనరించు
సర్వకళాశాల సాగుచోటు
ప్రజలనాహరించు బహుమత దేవతా
ద్వైనందినగ్లాని లేనిచోటు
నవనీతనిభమైన కవుల కమ్మని వాక్కు-
వెలుపులే కావిర్భవించుచోటు
సంతానమునకు వైషమ్యంబు నేర్పని
తల్లిదండ్రులు విరాజిల్లుచోటు

విసపునవ్వులలాహిరీ వేసగాండ్ర
పాదచిహ్నాల మరక లేర్పడనిచోటు
తోడునీడయు లేనట్టి దుర్బలులకు
గబ్బిలపుచాన వాసయోగ్యంబుగాదె? ౧౧౮

జాతీయపౌరుషజ్వాలన మాబాల్యంబు
సవరించు కావ్యరాజములు లేక
విక్రమక్రమశిక్ష వెన్నతో[illegible]డు జిజా
సతివంటి మాతృదేవతలు లేక
ఒకజుట్టు నొకబొట్టు నొకకట్టుబడి నేర్పి
పాలింపజాలు దేవతలు లేక
కులమెల్ల చెదరి తెంపులు తెంపులగుచుండ
వారించి కాపాడు ప్రభువు లేక

బుద్బుదంబులకెనయైన మూడునాళ్ళ
పదవులకు ప్రతిష్ఠలకునై ప్రాకులాడి
నరులనమ్మించుకొన లేక నమ్మ లేక
చిదికియున్నవి మాజాతిజీవితములు. ౧౧౯

ఆసల్ చెప్పెదు రిప్పుడుం గురులు ముం దాకాశసింహాసనా
ధ్యాసీనత్వము సంఘటించునిది సత్యంబంచు భూపింతు రీ
బీసీనాటి పురాణగాథలు రుషావేషంబు తగ్గించి నా
దాసత్వంబు స్వీకరించెదు పరంధామంబు నాకేటికిన్. ౧౨౦

పుట్టుకపూర్వమే తలను జంపినజాతి మతప్రచండ సం
ఘట్టన జేసినా సహజకౌశలముల్ నశియించిపోయె నీ
కట్టినకట్లు విప్పునధికారము లేని గురుండెవండొ యీ
యుట్టికినెక్కలేని నను నూచెడ నంటవిముంతడోలికన్ ౧౨౧

నను సృష్టించినవాడె నా వెనుకజన్మంబెత్తు నే నోరెఱుం
గని నన్నీ పదివేలరూపములతో కంగారుగానించునే
కనకంపుంగుడి గోపురాగ్రములు నాకాంక్షించునే? నాసికల్
గొనునే! యిట్టివిమోసగాండ్రయిన భక్తుల్ పన్ను సన్నాగముల్.

అనినమాటను మార్చుకొనలేని శాస్త్రముల్
స్వాభిమానము దక్క పలుకగలవె?
కులముంచుకొని నన్ను గొలుచుకొండెడు వేల్పు
కడగి నా కన్నీరు గడుపగలడె?
మానవదాస్యంబు మరగినలోకంబు
నెనరూని నా చెల్మి నెఱపగలదె?
అస్వాభావికథావ్యాసంగ హతమైన
పృథివి సత్యంబు నూహింపగలదె?

యుడుకురక్తమెన్నడో చచ్చుబడిపోయి
చేతులెత్తిమ్రొక్కు స్త్రీయజాతి
కఱకు వీరసూక్తు లరిగించుకొని లేచి
యెదుటనిలిచి పగర నదమగలదె ? ౧౨౩

ధర్మసంస్థాపనార్థంబు ధరణిమీద
నవతరించెదనని నబ్జభవునితండ్రి
మునుపు జన్మించి నెత్తి కెత్తినది లేదు
నేడుజన్మింపకున్న మున్గినది లేదు. ౧౨౪

కనుపడలేదు దైవతముగాని పదార్థము భారతంబునన్
గనుపడలేదు సత్కులముకన్న మహాకళ భారతంబునన్
కనుపడలేదు వర్ణమునకన్న పిశాచము భారతంబునన్
గనుపడలేదు పంచమునికన్నను నీచపుజంతు వేదియున్. ౧౨౫

హక్కుల్ దొంగలు దోచుకొన్నను మనుష్యత్వంబు జంతుత్వమై
చిక్కుల్ బెట్టెడు కాలమందును క్షమాసిద్ధాంతముల్ నేర్వనా
పక్కా పౌరుష వహ్నినార్పుమత రూపక్రూర సింహంబు నా
ప్రక్కంబండులు నూరుచున్నదితలంపన్ శల్యసారథ్యమై. ౧౨౬

జగముల్ మెచ్చు బియే ఎమేలు బిరుదుల్ సాధించినామంచు నీ
లుగు మా మాలలు మాదిగల్ గులమహాక్షోభంబు రెట్టింపగన్
తెగలంగట్టి తగాదలెంచెదరు గానీ సంధి గావింపరో
ఖగభామా! మతబోధ లేల కుల కష్ట్యభ్రష్టదుర్జాతికిన్. ౧౨౮

అసలే ముక్కిడి దానిమీద పడిసెంబన్నట్లు మాజాతి బా
నిస లారా! కలహించుచుందు రుభయుల్ నీచోచ్చతానిర్ణయ
వ్యసనవ్యగ్రత సిగ్గుచేటగునయో! యస్పృశ్యతాత్రాసమం
త్రసమేతుండగు గాంధినేర డివి యంతర్నాటకారాటముల్.

భీతింగొల్పెడు నస్వాభావిక కథావేదాంత శాస్త్రాలికిం
జేతుల్ మోడ్చు నమాయకప్రజలు సంసేవింప భోగాబ్ధిలో
నీతల్ గొట్టు కవిప్రకాండముల సాహిత్యప్రపంచంబులో
ప్రాతఃకాంతులు జిమ్మునట్టి కవితాభానుండు జన్మించునే. ౧౨౯

నటకుని వోలి కాలపరిణామవిధేయములై రహించు ను
త్కటమత ధర్మశాసననికాయము తీరుపుచేసి సంఘ సం
కటముల పాలొనర్చి యధికారము సేయు దరిద్రజాతిపై
కటకటనల్వురాడు నెడ కల్లయథార్థము గాకపోవునే. ౧౩౦

రచ్చలకెక్కనీక సమరంబున బూడ్చిన కర్ణశక్తి నే
డెచ్చటజూచినం బ్రథవహించి సముజ్జ్వలమై వెలుంగదే
కచ్చ లసూయలుం గళ నొకానొక కాలము డాచియుంచినన్
హెచ్చితురంగలించి ధ్వజ మెత్తకపోదు యుగాంతరంబునన్.

కవ్వడి పరువున్నిల్పగ
నవ్వసు దేవాత్మజాతు డట్లనెగా నీ
కవ్వడి కర్ణునిగెల్చుట
నవ్వులపా టనెడుమాట నల్వురెఱుఁగరే. ౧౩౨

పలదన్నఁ వెనువెంటనంటి నను నిర్బంధించి వేధించు వే
ల్పులా సిద్ధాంతములెల్ల నా సహజసంపూర్ణ ప్రతాపంబు లో.
జిలికెం జిక్కని చచ్చుమందు మునిపక్షీ! యింక నీవంటి గ
బ్బిలముల్ సేయు హితోప దేశములు వేవే ల్గాలికాహారముల్.

అగుపించెనే యసూయాదుర్గుణజ్వాల
సంహారించెడు శాస్త్రసముదయంబు
పరికించివచ్చితే పరమతసహనంబు
భాషించు వేదాంతపాఠశాల

వీక్షించితే వర్ణభేదాల వ్యాధిచే
శాంతిగా రాజ్యంబు సలుపునెలవు
కనఁగొంటివే మనుష్యునిఁజూచి మనుజుండు
మిట్టిమీనై దాటునట్టిసీమ

నేను చిందులాడి నేను డప్పులుగొట్టి
యలసి సొలసి సత్తికొలువు గొలువ
ఫలితమెల్ల నొరులు భాగించుకొనిపోవు
నీచమైనభూమి జూచినావె ? ౧౩౪

క్రూరుల్ కుత్సితు లస్మదీయములు హస్తాల్ దోచుకొన్నారు న
మ్నారింబైటకు నెట్టినా రిపుడు నన్నోహిదార్చుచున్నారు గాం
ధారేయుల్ నైలకొల్పినారు బహుసంస్థల్ లక్క-యిండ్లక్కటా
మూరుందమ్ములు సమ్మజాలని విశ్వాత్మశ్రీసమారంభముల్.

తనరక్తంబు వ్యయించి సత్కవికళాద్రవ్యంబు వెచ్చించి మ
ల్చినశిల్పాలువిమర్శకబ్రువుల కత్తిన్వ్రాతలం ఖ్యాతికె
క్కని వైపోయె సహాయచేబలుకునాల్కల్ సత్యమున్ జాటునే
అనుమానింతురు కొందరీశ్వరుని ధర్మాధర్మనిర్ణేతృతన్.

జనులం బిలిచి పిప్పిజేసెడు దురాచారంబులన్ గాలమ
ట్టని విద్యాబలమేల ? విద్యయన మాధ్యవ్యాఘ్రికింపైన భో
జనమా ? మోసపు వ్రాతకోతలకు రక్షాబంధమా యెందుకీ
మనుజత్వంబు కొసంగలేని చదువుల్ మైరేయపుం మైకముల్.

చిరకాలంబును భిన్నజాతి మతముల్ జీవించు రాజ్యాన సు
స్థిరమై శాంతి రహించునన్ననుడి సందేహించెదం బక్షిణీ
తురకల్ హైందవులీ స్వరాజ్యరథమున్ దొర్లింతురే? దక్షిణో
త్తర దిగ్దంతులు రెండునుం గలసి మేతల్ మేయు తావున్నదే.

వీర వసంతరాయఁడను వేల్పొక మద్భవమంది దుష్ట సం
హార మొనర్చు ధర్మము సహస్రముఖంబులు నాటునంచు నా
జారిన గుండెలో వెలఁపుసల్లుదు రీ యనృత ప్రచారకుల్
కారణమ్మ పిచ్చితలకాయలకున్ వెఱ నమ్మకాలకున్. ౧౩౯

పుట్టించెం దయలేని లోకమున నే పుణ్యాత్ముడో కుక్షిలో
ముట్టించెం బాగలేని యాకటిసొదన్ మూపూటలీచిక్కులో
నట్టిట్టై తపియించు నాకొదవు నాహారంబు భక్షింపగా
పుట్టంజొచ్చిరి దేవతల్ బహుళరూపుల్ బుట్టలైచెట్లులై. ౧౪౦

గబ్బిలము

అట్టు లెడందనేర్చెడు మహావ్యథనాతడు వెళ్ళగ్రక్కె—నా
బిట్టు! కదుష్ణబాష్పములు నిండిన కన్నుల సానుభూతి చూ
పెట్టి ప్రదక్షిణించి సురభిక్షుక నింటికి లేచిపోయె గ
వ్వట్టె స్వతంత్రభారత విభాకరబాలుడుతూర్పుడోలికన్. ౧౪౧

మునిపక్షి రాకపోకల
ఘనసందేశముల కతన ఖర్చయి పోయెన్
దనురక్త మా కరిద్రుండు
చనిపోవునో! తత్ఫలంబు జవిజూచెనో! ౧౪౨

Printed by Vemkatram Power Press, Ellore.
P. I. C. No. W. G. 1. Dec. 1946/1000 Copies.